


పూర్వకాలమందు ధారానగరాన్ని ఉగ్ర సేన మహారాజు, పరిపాలిస్తూ ఉండేవాడు. అయనకి ఆగ్రహం వచ్చినా అనుగ్రహం వచ్చినా పట్ట పగ్గాలుండవు.

ఆ మహారాజుకి రూపసుందరి, హేమ సుందరి, గుణసుందరి అని ముగ్గురు కుమార్తెలు. గుణసుందరి పుట్టిన కొద్ది రోజులకే మహారాణి స్వర్గస్థురాలైంది. అప్పటినించీ మహారాజు తన కూతుళ్ళు ముగ్గురకూ తల్లిలేని లోపం కలుగకుండా, వాళ్ళ ఆలనా పాలనా స్వయంగానే చూస్తూ పువ్వులలో పెట్టి బిడ్డలను అల్లారుముద్దుగా పెంచుకొంటున్నాడు.

ఈ మమకారంలో పడి, మహారాజు రాజ్యమూ, రాచకీయాలూ మరచేపోయాడు. మంత్రులూ, సేనాధిపతులూ మొదలైన ప్రముఖులందరూ మహారాజును దర్శించి, "దేవరా!—తమకు పుత్రసంతానం లేదు. ముందు రాజ్యం గతి ఏంకావాలె! మా మనవి మన్నించి మళ్లీ పెళ్లి చేసుకొన్న పక్షమందు తమకు వంశాధారమైన పుత్ర సంతానమూ కలుగుతుంది, మా కోరిక కూడా నెరవేరుతుంది" అంటూ విన్నవించుకొన్నారు.

ఈ మనవికి మహారాజు మండిపడి, "వంశానికి ఆధారం కొడుకులేనా? కుమార్తెలు మాత్రం నా అంశలు కారా? నా రాజ్యం నా కూతుళ్ళకే ఇస్తాను. వాళ్లే నా రాజ్య మేలుతారు. నా మాటకు ఎవ్వరు అడ్డం వస్తారో చూస్తా" నంటూ, పరివారాన్నంతటినీ కసిరికొట్టాడు.

ఇలా వుండగా, ఒక సంక్రాంతి పండుగ నాడు, మహారాజు అల్లారుముద్దుగా పెంచుకొంటూవున్న కూతుళ్ళు ముగ్గురకోసం, రాజ్యంలో ప్రజలు అపురూపములైన కానుకలెన్నో పట్టుకువచ్చి, సమర్పించారు. ఆ

'నాగేంద్ర'




కానుక లన్నిటినీ మహారాజు చూడ ముచ్చటగా అమర్పించి, కుమార్తెలు ముగ్గురనూ ఎవళ్ళకేది ఇష్టమో ఎంచుకో మన్నాడు.

పెద్దవాళ్ళయిన రూపసుందరి, హేమసుందరి కలిసి ఆ బహుమతులలో ఉండే విలువైన చీనిచీనాంబరాలకోసమూ, మణిహారాలకోసమూ పోటీపడి కాట్లాడుకో బోయారు. సాత్వికురాలైన గుణసుందరి మాత్రం "పతివ్రతా కథాలహరి" అనే పుస్తకం ఒక్కటి తీసుకొని, పితృభక్తి కలది గనుక, రాశిలోనించి ఒక చక్కటి చేతికర్ర ఎంచితీసి, వృద్ధుడైన తండ్రికి



పట్టుకువెళ్లి ఇచ్చింది. మహారాజు ఆనందభరితుడై, తన చిన్ని కూతురికి తనపైగల భక్తి ఎటువంటిదో తెలిసికోమంటూ, ఆ చేతికర్రను పరివార మందరకూ ముచ్చటగా చూపించాడు.

మహారాజుకు హరమతీ కాలమతీ అని ఇద్దరు మేనల్లుళ్ళు ఉన్నారు. వాళ్ళు ప్రపంచజ్ఞానం లేని వట్టి మూర్ఖులూ, సాపాటురాముళ్ళున్నూ. అయినా, వాళ్లంటే మక్కువ కావటంచేత వాళ్ళను పెద్దమ్మాయిలు ఇద్దరకూ నిశ్చయించి, చిన్నమ్మాయికి వరుడు చిక్కగానే, మూడు పెళ్లిళ్లూ ఒక్కసారి చేసేసి, రాజ్యం కుమార్తెలకు వప్పగించి, తను విశ్రాంతి తీసుకొందామని అనుకున్నాడు మహారాజు.

ఇంతలో మహారాజుగారి షష్టిపూర్తి మహోత్సవం అతివైభవంగా జరుగుతున్నది. ఆ రోజున ఆయన సగర్వంగా కుమార్తెలను వెంటబెట్టుకుని సభకు వెళ్ళాడు. నిండు దర్బారులో మహారాజు "చూడండి, పదహారేండ్లుగా నాసర్వస్వమూ వినియోగించి సాధించిన రత్నాలు ఈ నా ముగ్గురు కుమార్తెలూను. ఇక నా రాజ్యం వీళ్ళకే ఇస్తాను. వీళ్ళకు నేనంటే



ఎంత భక్తి, ఎంత ప్రేమ! అది ఎటువంటిదో వాళ్ళే చెప్పుతారు. విని ఆనందిద్దురు గాని..." అంటూ చెప్పి కూర్చున్నాడు.

అప్పుడు పెద్దకూతురు రూపసుందరి లేచి, సభకు నమస్కరించి, తడుముకోకుండా తీయని మాటలతో "నాకు నా తండ్రే ప్రాణం, తండ్రే దైవం, తండ్రే సర్వమున్నూ" అని బొంకింది.

తరువాత రెండవకుమార్తె హేమసుందరి కూడా సభకు నమస్కరించి, తన అక్క చెప్పినట్టుగానే, "నేను నా తండ్రి సేవకోసమే జన్మించాను. ఎన్ని జన్మలకైనా ఆయనే నా తండ్రి కావాలని తపస్సు చేస్తాను" అంటూ బొంకి కూర్చున్నది.

రూపాహేమలు కేవలమూ స్వార్థపరలు. తండ్రిని మెప్పించాలని అబద్ధాలాడారు. గుణసుందరి ఉత్తసత్యకాలపుపిల్ల. నిజానికి తండ్రిమీద గుణసుందరికే ఎంతో ప్రేమ ఉన్నది. ఆ సంగతి మహారాజుకీ తెలుసు. అందుచేతనే, పెద్దపిల్లలిద్దరికంటే కడసారిది అయిన గుణసుందరి తనను మరీ ఎక్కువగా పొగడుతుందని ఆశించాడు.

నిజం చెప్పవలసివస్తే, తన జవాబు తండ్రికి రుచించదు. అందుచేత ఇటువంటి





సందర్భంలో ఊరుకోవడమే మంచిదని తలంచి, గుణసుందరి మాటాడక నిలిచింది. ఈ వాలకంచూచి అమె సిగ్గుపడుతున్నది కాబోలునని తలిచాడు మహారాజు. "అమ్మాయీ! నీ అక్కలకంటె నీకు నా మీద ప్రేమ ఎక్కువ. నన్ను గురించి వాళ్ళకంటె నీవే బాగా చెప్పగలవు. కనుక చెప్పమ్మా!" అని అన్నాడు.

అప్పుడు గుణసుందరి "నాయనగారూ! తండ్రిని కూతురు ఎంతవరకూ ప్రేమించాలో, అంతగా నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. కాని స్త్రీకి భర్తే సర్వమున్ను. వివాహమైనప్పటినించీ సతికి, పతిని సేవించడమే విధాయకం" అంటూ, మనసులో మాట దాపరికం లేకుండా వెల్లడించే వరకు, మహారాజు ఉగ్రుడైపోయాడు.

"కృతఘ్నురాలా! పిచ్చిగా మాటాడుతున్నావు. భర్త కుంటి, గ్రుడ్డీ, మూగా, చెవిటీ, వృద్ధూ, దరిద్రుడూ అయినట్టయితే, అతడే సర్వస్వమని ప్రేమిస్తావా?" అని అధిక్షేపించాడు మహారాజు.

"దేవుడు అటువంటి భర్తనే నిర్ణయించే పక్షమందు, సంతోషంతో శిరసావహించి ప్రేమిస్తాను" అని గుణసుందరి నిబ్బరంగా జవాబు చెప్పింది.

"దేవు డెవరు? నేనా, దేవుడా నీకు పతిని నిర్ణయించేది?" అన్నాడు మహారాజు. అందుకు గుణసుందరి మృదువుగా "దేవుడే, నాన్నగారూ!" అని సమాధానం చెప్పింది. అప్పుడు మహారాజు "అబ్బో, అంత గర్వగా ఉన్నదా నీ పని? తగిన శాస్తి చేస్తానుండు" మంటూ గద్దించి, ఆగ్రహంతో సభవిడిచి వెళ్ళిపోయాడు.

రాజు తలిస్తే దెబ్బలకు కొదువా? మరునాడే ముహూర్తం పెట్టించాడు మహారాజు. రూపసుందరిని హరమతికీ, హేమసుందరిని కాలమతికీ ఇచ్చి వైభవంగా పెళ్ళి




చేశారు. పాపం, గుణసుందరికిమాత్రం కుంటీ, గ్రుడ్డీ, మూగా, చెవిటీ అయిన ఒక దరిద్రుణ్ణి తీసుకవచ్చి కట్టబెట్టారు.

తండ్రి చేసిన ఈ అఘాయిత్యానికి గుణసుందరి ఏమాత్రమూ చలించక, దైవంమీద భారంవేసి నిశ్చింతగా ఉంది. తనకు ఈ భర్త లభించటం ఈశ్వర ప్రసాదమే అని నమ్మి, శిరసావహించి, అమె భక్తితో పతిని సేవిస్తూ ఉంది.

పెళ్ళి అయిన మరుక్షణంనించీ రూపా, హేమలు వాళ్ళ అందచందాలకు ఉబ్బిపోతూ, తమతమ అదృష్టాలకు మిడిసిపడుతూ, భర్తలతోకలిసి చెల్లెలినీ మరదినీ నిరసించి వేళాకోళం చేయ నారంభించారు. ఎవరేమనుకొన్నా, ఎన్నెన్ని తిప్పలు పెట్టినా, గుణసుందరి మాత్రం వాటిని పాటించక, ఓర్చుకుంటూవుంది.

దైవాన్ని నమ్మినవాళ్ళకు ఎప్పటికీ చెరుపు లేదంటారు పెద్దలు. మొదటినించీ దేవుణ్ణే నమ్ముకొనివున్న గుణసుందరి జీవితంలో తలవని తలంపుగా ఒక చిత్రమైన మార్పు వచ్చింది. మహారాజు గుణసుందరికి శాస్తి చేదామనే సంకల్పంతో ఏరీ, కోరీ తెచ్చిన అమె భర్త—అందరూ అనుకొన్నట్టు కుంటీ కాదు, గ్రుడ్డీకాదు, మూగా కాదు, చెవిటీ కాదు.

ఉన్నట్టుండి అతను వింతగా గెంతుతూ, చిత్రంగా ఛలోక్తులు విసరుతూ, వదినెలనూ వారి భర్తలనూ భరతంపట్టి, వెంటాడటం మొదలెట్టాడు. వాళ్ళందరకూ ఏమీ తోచక కంగారుపడుతున్నారు. ఈ విధంగా రాజావారి చిన్నల్లుడు వింతగా విజృంభించే వరకు, కోటంతా ఒక కొలిక్కి వచ్చింది. ఈ హడావిడి అంతా తెలిసి, మహారాజు కూడా పరుగెత్తుకువచ్చి, కళ్లారా చూశాడు.

తాను గుణసుందరికి పాఠం చెప్పాలని ఇంతా చేస్తే, వీడెవడో తనకే శాస్తి చేశాడే



అని మహారాజు మండిపడుతూ, "ఎవడవురా నీవూ, నీ అగడమేమిటి? నన్నే మోసం చేశావే? చూసుకో, నీ పని ఏమవుతుందో!" అని గర్జించాడు.

అందుకు గుణసుందరి భర్త ఠీవిగా నుంచొని, "నేను మీ ముద్దుటల్లుడ్ని. దైవాధీనాన్ని" అంటూ, చిద్విలాసంగా నవ్వాడు. దానితో, ఆవేశపూరితుడైన మహారాజుకి కంపరమెత్తి, దైవాధీనాన్ని కొట్టబోయి, పట్టు తప్పి దభాల్న కింద పడ్డాడు. ప్రమాదకరమైన దెబ్బలు తగలటంచేత, మహారాజు లేవలేక పోయాడు. ఆ పాటు గ్రహపాటై, అయనను మంచంపట్టించింది.



గుణసుందరి దుఃఖిస్తూ తండ్రి దగ్గరకు వెళితే, "ఇది నా చావుకు పుట్టింది; వాడేదో పంపకం; వీళ్ళను సాగనంపండి" అంటూ మహారాజు ప్రలాపించాడు.

అక్క లిద్దరూ ఆమెను చూచి, "పుట్టిననాడు అమ్మను సాగనంపావు; పెళ్లినాడు అయ్యను మంచమెక్కించావు. చాల్లే..." అని కసిరికొట్టారు.

ఈ మాటలకు గుణసుందరి భర్తకు పౌరుషం వచ్చింది. భార్యను తీసుకొని తిన్నగా మామగారి వద్దకు వెళ్లి, "ఎప్పటికైనా మేమే నీకు దిక్కయ్యేది. జ్ఞాపకం ఉంచుకో" మని హెచ్చరించి, దైవాధీనం భార్యతో సహా కోట దాటి వెళ్లిపోయాడు.

ఆ నగరు చివర ఎరుకలగూడెంలో, దైవాధీనం కాపురం పెట్టాడు. రాచకోటలోని రణగొణ అంతా ఊళ్లు దాటి, కోళ్లు దాటి, ఎరుకలగూడానికి కూడా ముందే తెలిసిపోయింది. రాజ్యలక్ష్మి కోట విడిచి, తమ గూడానికి వచ్చిందని సంబరపడుతూ, ఆ గూడెంవాళ్లు దైవాధీనానికీ, గుణసుందరికీ భక్తితో స్వాగత మిచ్చారు. క్షణంలో వారు ఆమెకు ఒక పర్ణశాలను తయారుచేశారు. కుటుంబానికి కావలసినవన్నీ చిటిక



సేవటిలో సమకూర్చిపెట్టారు. ఈ విధంగా ఇప్పుడు గుణసుందరికి వింత భర్తతో కొత్త కాపురం ప్రారంభమైంది. పాపం, తండ్రి అవస్థ తలుచుకొంటె పొరలివచ్చే దుఃఖాన్ని దిగమింగుకొని, భక్తి శ్రద్ధలతో ఆమె భర్తను సేవిస్తున్నది.

మహారాజు మంచంపట్టగానే ఇంట్లో అంతా రూపా హేమల శాసనంగా ఉన్నది. గుణసుందరి పూజించుకుంటూ వుండే శ్రీరాజరాజేశ్వరీ విగ్రహమూ, ఆమె నిత్య పారాయణ చేసుకొనే "పతివ్రతా కథాలహరి" పుస్తకమూ—ఈ రెండూ ఇంట్లో ఉండటం వాళ్లకు అనర్థకంగా తోచింది. అందుచేత, వాటిని తీసి పారవేయించబోయారు.

ఈ సంగతి, దాది మీనాదేవికి తెలిసింది. మీనాదేవి గుణసుందరికి తల్లితో సమానురాలు. ఆ అభిమానంచేత, గుణసుందరికి అపచారము జరగకుండా, రాజేశ్వరీ విగ్రహమూ, పతివ్రతా కథాలహరి పుస్తకమూ, అవసరమైన కొన్ని నగలూ బట్టలూ ఒక కావడిపెట్టెలో పెట్టి, అది పట్టించుకొని గుణసుందరికి ఇచ్చివద్దామని ఆమె ఎరుకలగూడానికి బయలుదేరింది.




దాది మీనాదేవి ఇంటికి రాగానే, ఆమె తన స్థితి చూచి ఎక్కడ జాలిపడిపోతుందోనని తలచి, గుణసుందరి లేని సంతోషం తెచ్చిపెట్టుకొని, తండ్రి క్షేమసమాచారాలు అడిగింది.

ఆమె తెచ్చిన వస్తువులు చూచి, "ఇవన్నీ ఏమిటి ? రాచవారి సొత్తు పూచికపుడకైనా నాకు గిట్టదు. పట్టించుకు పోవలసిందే" అన్నాడు దైవాధీనం. అప్పుడు మీనాదేవి "పోనీ, వీటినైనా ఉంచుకోండి" అని చెప్పి దీనంగా బతిమాలుతూ దేవీవిగ్రహాన్నీ, పతివ్రతా కథాలహరి పుస్తకాన్నీ విడిగా తీసి పెట్టింది. దైవాధీనం భార్యవేపు

చిలిపిగా చూచి, "అవ్వ వీటిని మనకు కట్టబెట్టుతున్నదా! సరేలే, ఉండనీ" అంటూ నవ్వాడు. వీటినైనా అంగీకరించినందుకు సంతోషించి, తక్కిన వస్తువులన్నీ పట్టించుకు వెళ్లిపోయింది మీనాదేవి.

ఇక, దైవాధీనం పైకి ముసలివాలకంగా కనపడినప్పటికీ, పడుచువాళ్లను మించి వింత వింత ప్రజ్ఞలూ, విశేషాలూ, ప్రదర్శిస్తూవున్నాడు. ఇందుకు అబ్బుర పడి గూడెంలో ప్రజలందరూ అతనికి జేజేలు కొడుతున్నారు. నిజానికి, అతనికి చేతకాని పనే కనబడదు. బొమ్మలు వేయ గలడు, సంగీతం పాడ గలడు, నాట్యం చేయగలడు. ఇలా రోజుకొక ప్రజ్ఞతో ప్రసన్నుడవుతూ, గుణసుందరికీ, గూడెం వాళ్లకూ ఆశ్చర్యం కలిగిస్తూ వున్నాడు. ఇదంతా చూచి, ఆమె తన భర్త గొప్ప ప్రజ్ఞాశాలి అనీ, అతనిలో ఉండే రహస్యాన్ని కనిపెట్టాలెననీ ఉత్సాహంతో ఉన్నది.

అక్కడ-మంచంలో పడిన మహారాజు యమయాతన పడుతున్నాడు. కూతుళ్లూ అల్లుళ్లూ అస్తమానం తన ఎదట కన బడుతూ ఉండాలంటాడు. వాళ్లసుఖాలు మానుకుని, కనిపెట్టుకొనివుండి ఉపచారం చేస్తారా ? చేసినా, ఎన్నాళ్లు ? తండ్రే తమ సర్వమూ అని బొంకిన పెద్దకుమార్తెలు ఇద్దరూ తండ్రియెడల దయా దాక్షిణ్యమూ లేకుండా, రాజ్యమెప్పుడు తమకు వస్తుందా అని ఎదురుచూస్తున్నారు.

మహారాజుకు ఆరోజుకారోజు వ్యాధి విషమిస్తున్నది. శస్త్రచికిత్స చేస్తేకాని బతకడని ఆస్థానవైద్యుడు చెప్పాడు. బల వంతముగానైనా సరే, శస్త్రచికిత్స చేయ మన్నారు, రూపా హేమలు. కూతుళ్లను చూచి, "ఇదేనా మీ ప్రేమ ? చూస్తూ చూస్తూ, నన్ను కోయిస్తారా ?" అంటూ మహారాజు గగ్గోలు పెట్టాడు.

(ఇంకా వుంది)






రాజు గోల చూడలేక, ఆస్థాన వైద్యుడు మళ్లీయోచించి, "మహేంద్రమణి అనిచెప్పి ఒక మణి ఉన్నది. ఎలాగైనా అది తెప్పించ గలిగితే, శస్త్ర చికిత్స అవసరం లేకుండా తప్పిపోతుంది. ఆ మణిని ఇలా తాకిస్తే చాలు, ఏ జాడ్యమైనా నయమైపోతుంది" అంటూ, సూక్ష్మమైన ప్రక్రియ చెప్పాడు.

అప్పుడు కోటలో అంజనం వేయించి చూచారు. వైద్యుడు చెప్పిన మణి మహేంద్ర పర్వతములో ఉన్నది. ఆ పర్వతానికి దండకారణ్యం చివర కాళికా లయంలోనించి ఒక సొరంగం ఉన్నది. ఆ మార్గంలో సింహ ద్వారం, మకర ద్వారం, కమల ద్వారం అని మూడు ద్వారాలు ఉన్నాయి. ప్రతి ఒక్క ద్వారాన్నీ ఒక్కొక్క యక్షకన్య రక్షిస్తూ వుంటుంది. ఆ యక్షితల్ని గెలిచి, ఆ ద్వారాలు దాటి వెళ్లి, ఆ మహేంద్రమణిని తీసుకరావాలి.

ఇంతపని చేసుకురావటం దుస్సాధ్య మని తెలిసేవరకు, రాజబలగమంతా "ఈ మణిని సాధించి తేవటం మా తరంకాదు" అని చెప్పేశారు. "ఎవరివల్లా కాకపోతే, రాజ్యంలో చాటింపు వేయించండి. మహేంద్రమణి తెచ్చి, నా ప్రాణం కాపా డినవానికి నా రాజ్యం ఇచ్చివేస్తాను. ప్రాణం నిలబడితేకద, రాజ్యం ఏలేది?" అన్నాడు మహారాజు.

ఇంకేముంది?—ఆ ప్రకారం మంత్రి చాటింపు వేయించేసరికి, మణిని తీసుకు వచ్చి రాజ్యాన్ని ఎవరు కాజేసుకుపోతారో అని రూపా హేమలకు మనస్సులో కల వరం పుట్టి, తమ భర్తలే తేగలిగినట్టయితే రాజ్యం తమకే ఉండిపోతుందికద అని ఆశించారు. ఈ ఆశతో వారు హరమతికీ, కాలమతికీ కత్తులుకట్టి, మణి తీసుకువస్తే కాని గడపత్రొక్క రాదని శాసించి, పంపారు.

'నాగేంద్ర'




యకీత లేమిటో, ఆ ద్వారా లేమిటో ఏమైనా తెలిస్తేగా? అదేదో సులువైన పని అనుకొని, రొమ్ము విరుచుకొంటూ వాళ్లు మణికోసం బయలుదేరారు.

తండ్రికి జబ్బుగా ఉన్న సంగతి తెలియగానే గుణసుందరికి దుఃఖం పొర్లుకు వచ్చింది. ఐతే, ఎలా రక్షించుకోవటం? తన భర్త కామరూప విద్య తెలిసిన ఘటికుడు. కాబట్టి ఆయన ఒక్కడు తలుచుకుంటేనే మణి సాధించుకువచ్చి, మహారాజును రక్షించగలడు.

గుణసుందరి భర్త పాదాలపైన పడి, "మీరు సర్వ సమర్థులు, సర్వజ్ఞులు. మీ చరణదాసినైన నా ముద్దు చెల్లించి, మహేంద్రమణిని తీసుకువచ్చి, మా తండ్రిని రక్షించండి" అంటూ ప్రార్థించింది.

అప్పుడు దైవాధీనం, తను చెప్పకపోయినా తన రహస్యాన్ని గ్రహించగలిగిన భార్య తెలివికి మెచ్చి ఆనందించాడు. ఆ వెంటనే అతను వృద్ధరూపం విడిచి, ఒక సుందరమైన రాజకుమారునిగా మారిపోయాడు. మెరసిపోతున్న పతి నిజరూపం చూచి, గుణసుందరి ఉత్సాహపడి "మీ జీవితరహస్యం ఏమిటి? చెప్పండి" అని వేడింది.

అందుకు అతను, "నేనొక రాజకుమారుణ్ణి. నా పేరు వీరసేనుడు. చిన్నప్పుడే నా తలిదండ్రులు రాజ్యభ్రష్టులై, గతించారు. అప్పుడు నన్నొక తపస్వి పెంచి, సకల విద్యలూ నేర్పాడు గాని, కామరూప విద్య మాత్రం నేర్పలేదు. అందుచేత వారు నిద్రిస్తూవుండగా నేను వారి గ్రంథాన్ని సంగ్రహించి ఈ విద్య తెలుసుకొన్నాను. ఈ సంగతి తెలిసి, తపస్వి నామీద కోపించి 'ఈ నీ విద్యారహస్యం నీ భార్యకు తప్ప మరెవ్వరికి తెలిసినా నీవు ఎలుగుబంటి వయిపోతావు' అని ఆయన నన్ను శపిం

చారు. కనుక జాగర్త!—నీవు ఈ రహస్యాన్ని ఎవరికైనా చెప్పితివంటే నేను ఎలుగుబంటి నైపోతాను సుమా!" అని దైవాధీనం గుణసుందరికి చెప్పి, మళ్ళీ ఎప్పటి ముసలిరూపం ధరించి, మణికోసం బయులుదేరాడు.

బయుల్దేరేముందు ఒక తులసిమొక్కను భార్యకు చూపి, "ఇదుగో, ఈ మొక్క పచ్చగా ఉన్నంతకాలమూ నేను క్షేమంగా ఉన్నట్టు. అది ఎప్పుడు వాడిపోతే అప్పుడు నాకు అపాయం సంభవించిందని అనుకోవలసింది" అంటూ దైవాధీనం ఆనవాలు చెప్పాడు.

హరమతీ, కాలమతీ ఒకరోజు క్రిందటనే బయల్దేరినా, దైవాధీనం వాళ్ళకంటె చాలా ముందుగా వెళ్ళి, దారిలో వాళ్ళకి ఎదురుపడ్డాడు. ఇతనిని చూడగానే వాళ్లు "నీ బతుక్కి నువ్వూ మణి సాధించుకు రావటానికే బయల్దేరావా? నీ అవతారానికి తోడు, రాజ్యంకూడా కొట్టేదామని చూస్తున్నావా?" అని హేళన చేశారు.

అందుకు దైవాధీనం "అబ్బే, నేనేమిటి? మణిని సాధించుకు రావడమేమిటి? అక్కడి వింతలూ విశేషాలూ ఏమిటో చూచిపోదామని వచ్చాను. నన్నుకూడా



మీవెంట తీసుకు వెళ్ళండి" అని ప్రాధేయపడినట్టు నటించాడు. వాళ్ళు "సరే, మేము వాయువేగాన వెళుతూ వుంటాము. కాళ్ళీడ్చుకొంటూ నీవు మా వెనక రావలిసింది" అని చెప్పి, ఉడాయించారు.

వాళ్ళ అవివేకానికి నవ్వుకొంటూ, దైవాధీనం అక్కడనే మాయమై, క్షణంలో కాళికాలయంలో వెలిశాడు. ఆలయపు గర్భగుడిలో దేవి విగ్రహానికి వెనుక ఒక కీలున్నది. అది తిప్పితే, ఆ విగ్రహం వెనక్కుతిరిగి, మహేంద్రగిరికి పోయే సొరంగద్వారం తెరుచుకుంటుంది. ఆ కీలకం తెలిసిన దైవాధీనం సాంపర్యపతి



అయిన ఒక స్త్రీ రూపం ధరించి, శృంగారంగా ఆడుతూ, పాడుతూ అక్కడ వాళ్ళ కోసం నిరీక్షిస్తూ వున్నాడు.

కొంతసేపటికి, రొప్పుతూ రోజుతూ హరమతీ, కాలమతులు అక్కడికి చేరుకొన్నారు. స్త్రీరూపంలో దైవాధీనాన్ని చూచి, ఆమె యక్షిత అయివుంటుం దనుకొని, కత్తులు దూశారు వాళ్ళు. కాని, క్షణంలో ఆమె అందానికి తన్మయులైపోయారు.

దైవాధీనం వాళ్ళను ఒక ఆట ఆడించి చివరికి గికురించిపోయి, సొరంగంలో మాయమవుతూ, వాళ్ళకు వినిపించేట్టు వికటంగా నవ్వాడు.

అది విని, హరమతీ కాలమతులు కళ్ళు తెరిచి, ఆయక్షిత తమను తప్పించుకపోయి వెక్కిరిస్తున్న దనుకున్నారు. దాని పని పట్టాలనే వుద్దేశంతో, అటూ యిటూ గాలిస్తూపోయి, వాళ్లుకూడా ఆ సొరంగంలో పడ్డారు. పడితే పడ్డారు, ఎలాగో సొరంగం కనిపించింది గనుక, వీపులు దులుపుకొని అందులో చొరబడ్డారు. వీళ్ళను చూచి దైవాధీనం, నిజరూపంలో వెలికిలా పడుకొని, గుండెమీద ఒక బండ పెట్టుకొని, ఆరున్నొక్కరాగం ఆలపించాడు. అంతలో హరమతీ కాలమతులు వానిని రక్షించగల మొనగాళ్ళమంటూ వచ్చి, గుండెపైనవున్న బండను తీసివేసి, దైవాధీనాన్ని పరామర్శించారు. అతను "యక్షిత! యక్షిత!" అని భయం నటిస్తూ మెల్లిగా లేచాడు.

"ఓస్, ఈ మాత్రానికే భయపడుతున్నావా? లే, లే. యక్షితను మటుమాయం చేసివచ్చాములే" అని అన్నా, తమ్ముడూ ఏకకంఠంతో ప్రగల్భాలు కొట్టారు. వీళ్ళ డచ్చీలకు లోలోపల నవ్వుకొని, "ఐతే పదండి!" అంటూ దైవాధీనం దారితీశాడు.

ఈ విధంగా వాళ్ళను దద్దమ్మలుగాచేసి ఆడిస్తూ, దైవాధీనం సొరంగమార్గం బట్టి వెళుతూవున్నాడు. అలా ముగ్గురూ వెళ్లగా

వెళ్ళగా, కొంతదూరంలో సింహద్వారం ఉన్న గుహ చేరుకొన్నారు. అక్కడ అంతటా పుర్రెలు, అస్తిపంజరాలు, ఏమేమో కనపడుతున్నవి. పొగలు ఎగసి వస్తున్నాయి. గోండ్రింపులు వినబడుతున్నాయి. ఇటువంటి భయంకరమైన ఆ ప్రదేశం మధ్యని యక్షిత వీణ వాయించుతుంటూ కూర్చునివున్నది.



ఈ ముగ్గురనూ చూడగానే యక్షిత, "మహేంద్రమణికై వచ్చిన మానవాధములా మీరు! కాచుకోండి, పుచ్చెలు ఎగిరిపోతాయ్!!" అంటూ చివాల్నలేచి, కత్తి ఝుళిపించింది. హరమతీ కాలమతులు హడిలిపోయి, వెనుకడుగు వేస్తూనే ప్రగల్భాలు కొట్ట నారంభించారు. "నోరు మూసుకొని, నా కాలు కదల్చండి; సింహద్వారం తెరుస్తాను. లేకపోతే ఈ కత్తితో నరికివేస్తా" నని యక్షిత సింహనాదం చేసింది.

ఆ అరుపుతో అన్నాతమ్ములు చచ్చినట్టు, యక్షిత కాలు పట్టారు. కాని, కొంచెమైనా కాలు కదల్చలేక, అలసి సొలసి చతికిలబడ్డారు. వాళ్లు ఓడిపోవటంచేత యక్షిత కత్తిదూసి వారిని నరకబోయింది.

ఇంతసేపూ దూరంగా వున్న దైవాధీనం ముందుకువచ్చి, "యక్షితా, ఆగు. నీకాలు కదిల్చి, నా అన్నలను నేను రక్షించుకొంటాను" అన్నాడు. "సరేలే. శక్తిలో కాకపోయినా, మాటలలోఅయినా పడుచుతనం కనపడుతున్నది. నా కాలు కదుల్చు చూదాం. కదల్చలేకపోయావో నీ పితృదేవతల్ని కలుసుకొంటావ్ జాగర్త!" అని యక్షిత హుంకరించింది.

అప్పుడు దైవాధీనం, మహా కాలు కదిలించేవాడిలాగే చేతులు సవరించుకొని, పంజా విప్పి, వేళ్లు సారించి, వింతచేష్టలతో యక్షిత చూపులను అటూయిటూ మరలించాడు. ఆమె ఆదమరపుగా ఉండటం కనిపెట్టి యక్షిత కాలు ముద్దు




పెట్టుకోబోయాడు. "ఛీ! ఇదేమిటి?" అంటూ ఆమె కాలు విదిలించుకుంది.

"అదుగో, యక్షితా! కాలు కదిలించావు. ఓడిపోయావు" అన్నాడు దైవాధీనం. అతని యుక్తికి మెచ్చుకొని, యక్షిత సింహద్వారం తెరచింది. ఈవిధంగా ముగ్గురూ సింహద్వారం దాటిపోగలిగారు.

అటుపైని దారి మరీ అగమ్యంగా కనపడింది. అంతా చీకటిపుష్కరం. అందుచేత, హరమతీ కాలమతులు "బాబోయి, మాకు మణీవద్దు, ఏమీవద్దు. బ్రతికివుంటే చాలు" నంటూ వెనుకడుగు వేయటం ప్రారంభించారు. వాళ్లకు ధైర్యం చెప్పి, ఎలాగో మకరద్వారంవద్దకు చేర్చాడు, దైవాధీనం.

ఈ గుహ సింహద్వారపు గుహకంటె ఎక్కువ భయంకరంగా వున్నది. పొగలూ వెలుగులతోపాటు, ఉండివుండి, ఎక్కడ నించో గుండె పగులగొట్టేటటువంటి ఏడుపు వినవస్తున్నది. ఈ ఆర్తనాదం ఏ దిక్కు నుండి వస్తున్నదో తీరా చూదామని వెతకబోతే ఎవ్వరూ కనపడరు. ఇదిచూచి, వాళ్లకు భయమూ, ఆశ్చర్యమూకూడా కలిగినై.

ఇంతలో వాళ్ల ఎదుటనే తల విరబోసుకొని ఒక బండమీద కూర్చుని, వెక్కి వెక్కి ఏడుస్తూవున్న యక్షిత ప్రత్యక్షమైంది. వీళ్లను చూడగానే ఆ యక్షిత "మహేంద్రమణికోసం వచ్చిన మానవాధములా మీరు! నన్ను నవ్వించగలిగితే మకరద్వారం తెరుస్తాను, లేకపోతే మిమ్మల్ని చంపివేస్తా" నంటూ గద్దించి చెప్పింది.

ఓస్, ఇదెంతపని అనుకొని, హరమతీ కాలమతులు, నవ్వు పుట్టించే వక్రచేష్టలు ఎన్నో చేశారు. వాళ్ళ చేష్టలుచూచి, యక్షితకు మరింత ఏడుపే వచ్చింది కాని, నవ్వు రానేలేదు. "మీరు నన్నింక నవ్వించలేరు. మీకు చావే ప్రాప్తం" అనిచెప్పి, యక్షిత వాళ్లమీదికి ఉరకబోయింది. అన్నా






తమ్ముళ్లు ఇద్దరూ పోయి, దైవాధీనం వెనక నక్కారు. అప్పుడు దైవాధీనం ముందుకు వచ్చి, కిటుకు ఎక్కడ వున్నదో కనిపెట్టా లని, యక్షిత చుట్టూ ప్రదక్షిణం చేయ నారంభించాడు. లొట్టలు వేసుకొంటూ, అతను యక్షిత అందచందాలను పొగడటం కూడా ప్రారంభించాడు.

అతను తిరిగినట్లల్లా యక్షిత తిరుగుతూ వుండేవరకు, 'ఓహో, ఇదా నీ కిటుకు!' అనుకుంటూ, దైవాధీనం దానికి చక్కలిగిలి పెట్టబోయాడు. కిచకిచమని యక్షిత ఒక్క గెంతు గెంతింది. కుప్పగంతులు వేసు కుంటూ, దైవాధీనం యక్షిత వెంటపడ్డాడు. ఈ వాలకంచూచి, యక్షిత నవ్వు అపుకో లేక, మకరద్వారం తెరిచింది. ఒక్క చెంగున ముగ్గురూ మకరద్వారం కూడా దాటిపోయారు.

తరువాత అన్నదమ్ములు ముగ్గురూ కమలద్వారం చేరుకున్నారు. ఇక్కడ యక్షిత విలాసంగా ఆడుతూ పాడుతూ వున్నది. ఆమెపాటకు హరమణీ శాలమతులు తన్మయులైనారు.

వీళ్లను చూడగానే, యక్షిత "ఓరీ మానవాధములారా! నా చెల్లెళ్ళను మోసం చేసి వచ్చారా? చూడండి, ఇప్పుడే మిమ్మల్ని మింగివేస్తా" నంటూ, బ్రహ్మాండ మైన రాక్షసి ఆకారం దాల్చింది. ఆ పెను భూతాన్ని చూచి చూడగానే అన్నాతమ్ములు చావ సిద్ధపడి, మూర్ఛపోయారు.

అప్పుడు, యక్షితకూ దైవాధీనానికీ కామరూప విద్యలో ఘోరమైన యుద్ధం జరిగింది. చివరికి దైవాధీనం, ఒక సూక్ష్మ రూపంలో యక్షిత నోటిలో దూరి, దాని కుక్షిలో ప్రవేశించి, ఆయువుపట్టు చిక్కించు కొన్నాడు. అంతటితో యక్షిత లొంగిపోయి, ద్వారం తెరవటమేగాక, మహేంద్రమణిని పట్టుకువచ్చి, అతనిముందు పెట్టింది.

దైవాధీనం బయటకు వచ్చి, ఆ మణిని తీసుకున్నాడు. అప్పుడు ఆ యక్షిత అతనికి

"అనంతానోక నిగమ నిగమన ఘృణీ మహేంద్ర మణీ" అనే మంత్రం ఉపదేశించి, అది పఠించినట్టయితే మణి ప్రకాశించి, కోరిన ఫలం ఇస్తుందని చెప్పి అంతర్ధానమైంది.

ఈ విధంగా దైవాధీనం తన యుక్తిచేతా చాకచక్యంచేతా, కామరూపవిద్యాప్రభావంచేతా యక్షిణులు ముగ్గురనూ గెలిచి, మంత్రంతోసహా మహేంద్రమణిని సాధించుకు రాగలిగాడు. ఇక యిప్పుడతను హరమతీ కాలమతులను మూర్ఛతేర్చి, మంత్రం పఠించి, మణిని పలికించి దాని విధానం వారికి చూపాడు.

ముగ్గురూ అక్కడినించి తిరిగివస్తూ, ఇంటిముఖంపట్టి, దారిలో మళ్లీ కాళికాలయందగ్గరకు వచ్చి అక్కడ కాస్త విశ్రాంతి తీసుకుందా మనుకున్నారు. దైవాధీనం మణిని తలక్రిందపెట్టుకుని పడుకొనడం చూచి హరమతీ కాలమతులు దురుద్దేశంతో కపటనిద్ర నటించారు.

ఆదేసమయానికి, గుణసుందరి తనను తలచుకొని తండ్రి పశ్చాత్తాప పడుతున్నాడనివిని, తండ్రిని చూచివద్దామని కోటలోకి వెళ్ళింది. రూపా హేమలు ఆమెను గడపలోనే అటకాయించి, "ఛీఛీ, ఎరుకలవాళ్లనూ ఏనాదివాళ్ళనూ కట్టుకొని, మాకు ఎంత అప్రతిష్ఠ తెచ్చావు? నీభర్త హీనుడు, దరిద్రుడున్ను" అంటూ అనరాని మాటలు అన్నారు.

పతినింద సహించలేక గుణసుందరికి ఆవేశం వచ్చి, "అక్కలారా! మీ రనుకొన్నట్టు, నాభర్త హీనుడూ కాడు, దరిద్రుడూ కాడు. కామరూపవిద్య తెలిసిన వీరసేన మహారాజు. వారే మణిని తీసుకువచ్చి నాన్నగారిని రక్షిస్తారు" అన్నది సగర్వంగా.

సరీగా, ఆ క్షణాన దైవాధీనం నిద్రలో ఉండటంచూచి, హరమతీ కాలమతులు అతనిని ఒక పాడు బావిలో పడవేసి, ఆ మణిని పట్టుకొని, ఇంటికి ఉడాయించారు.

(ఇంకా వుంది)






ఆవేశంలో గుణసుందరి చెప్పకూడని రహస్యం చెప్పివేయడంచేత, పాపం, దైవాధీనం బావిలో పడినప్పుడే ఎలుగుబంటిగా మారిపోయాడు. అతను దుఃఖిస్తూ, ఎలాగో పైకివచ్చి, ఇంటిదారి పట్టాడు.

పోతే, గుణసుందరి చెప్పకూడని రహస్యాన్ని చెప్పివేసిందేకాని, వెంటనే తెలివి వచ్చి, గాబరాతో ఇంటికి వెళ్లి చూచుకొనే వరకు తులసిమొక్క వాడిపోయివున్నది. ఇంకేమున్నది?—తన అపరాధంమూలాన భర్తకు కీడుమూడింది. గురుశాపంప్రకారం అతను ఈపాటికి ఎలుగుబంటిగా మారిపోయివుంటాడు, అని భరించరాని విచారంతో గోడుగోడున ఏడుస్తూ, ఆ తులసి దగ్గరే స్పృహతప్పి పడిపోయింది.

అక్కడ రాజుగారికి చాలా ప్రమాదంగా ఉన్నది. ఏమిటిరా భగవంతుడా అని కోటలో అందరూ చింతిస్తున్న సమయంలో, హరమతీ కాలమతులు మహేంద్రమణిని తీసుకువచ్చి, మహారాజు ఎదుట పెట్టారు. అదిచూచి, తండ్రిరాజ్యం తమకే దక్కింది కదాఅని రూపా, హేమలు పొంగిపోయారు.

కాని, మణిని చూచి రాజవైద్యుడు "ఇది ప్రకాశించటం లేదే!" అన్నాడు. 'ఉండండి, మంత్రం చెప్పాలి' అంటూ అన్నాతమ్ముడూ అట్టహాసంగా "హనుమంతు తోక" అనీ, "నిగనిగ" అనీ అరుస్తూ మణిచుట్టూ తిరుగ సాగారు. వాళ్లు ఎంతగా అరచినా, మణి ప్రకాశించలేదు. ఇదేమి మంత్రమంటూ అందరూ తెల్లబోయారు. "నన్ను మోసం చేసి, రాజ్యం లాక్కోవటానికి ఏదో రాయి పట్టుకొచ్చారు. వీళ్ల తలలు ఖండించి, గుమ్మానికి వేలాడదీయండి!" అని మహారాజు గోండ్రించాడు.

రాజవైద్యుడు నిదానంగా మణిని పట్టి చూచి "దీని లక్షణాలన్నీ సరిగానే కనబడు

'నాగేంద్ర'



తున్నయి. ఇది నిజంగా మహేంద్రమణే. కాని, వీరు దీనికి ప్రయోగించవలసిన మంత్రం మరచివుంటారు" అన్నారు.

"అయితే, ఆ మంత్రమేదో జ్ఞాపకం చేసుకొని ఏడవమనండి" అంటూ మహారాజు నిస్పృహతో చెప్పి, ప్రాణంమీది ఆశ వదులుకున్నాడు.

దైవాధీనం—అంటే ఇప్పుడు ఎలుగుబంటి—ఎరుకలగూడెంలోకి రాగానే, అంతా కేకలు వేస్తూ బడితెలు పుచ్చుకుని వెంటపడ్డారు. ఆ కేకలకు అదిరిపడి, ఏమిటో చూదామని గుణసుందరి ఇంటిలోనించి ఇవతలకు వచ్చింది.

ఆ ఎలుగుబంటి దీనంగా గుణసుందరి వెనుకకు వచ్చి నక్కింది. "అది మిమ్మల్ని ఏమీ చేయదు భయపడకండి మీ దారిని మీరు వెళ్లిపొండి" అని ఆమె గూడెం ప్రజలను వారించి, చేతులారా చేసుకొన్న పాప ఫలానికి మొత్తుకుంటూ ఎలుగుబంటిని లోపలకు తీసుకుపోయింది. పట్టరాని దుఃఖంతో గుణసుందరి ఎలుగుబంటి రూపంలోవున్న భర్త కాళ్లమీద పడి, తెలియక చెసిన ఈ అపరాధానికి క్షమించుమని ప్రార్థించింది.

దైవాధీనం ఎలుగుబంటిగా మారిపోవచ్చు. అతనికి ఈ రూపంలో వాక్కు లేకపోవచ్చు. అయినప్పటికీ అతను సర్వజ్ఞుడాయె. గుణసుందరి మొర విని, దైవాధీనం అక్కడ వున్న శ్రీ రాజరాజేశ్వరీ విగ్రహాన్ని చూపెంచి, "ఆ తల్లే మనకు దిక్కు. కనుక, ఆమెను ప్రార్థించు" మంటూ సంజ్ఞ చేశాడు. భర్త ఆజ్ఞ తలదాల్చి గుణసుందరి తమ ఇలువేలుపైన దేవికి భక్తితో మ్రొక్కులిడి ప్రార్థించింది.

తన భక్తురాలు, పతిభక్తిపరాయణ అయిన గుణసుందరి చేసే ప్రార్థనలు కైలాసంలో వున్న పార్వతీదేవికి వినపడినై.



కరుణామయి, ఆశ్రితజన పక్షపాతి అయినటువంటి దేవి పరమేశ్వరునితో ఈ సంగతిచెప్పి గుణసుందరిని అనుగ్రహించవలసిందని వేగిరపెట్టింది.

ప్రియసతి అయిన పార్వతి మనవిని పరమేశ్వరుడు ఎప్పుడైనా కాదనగలడా? వెంటనే ఆ దంపతులు కిరాతదంపతులయి గుణసుందరి ఇంటిముందు అవతరించారు.

ఆ ఇంటికి వెళ్లి తలుపు తోసుకొని "కొంచెం బిచ్చం పెట్టే చిట్టితల్లీ" అని వారు అడిగారు. వారినిచూచి గుణసుందరి తన నిర్భాగ్యత్వానికి చింతిస్తూ, బొటబొట కన్నీరు రాల్చింది. అప్పుడు ఆ కిరాత దంపతులు గుణసుందరిని ఓదార్చి, "చిట్టి తల్లీ! నీ విచారానికి కారణం మాకు తెలుసు. నువ్వు అలా విచారించవలసిన పని ఏమీ లేదు. నీతో వున్న ఆ ఎలుగు బంటిని మాకు ఇచ్చివేయి. దానిని ఆట లాడించి ఐశ్వర్యం సంపాదించుకు వస్తాము" అన్నారు.

ఈ వింతకోరిక వినేసరకు గుణసుందరి బిత్తరపోయింది. ఆమె బిత్తరపాటు చూచి దివ్యుల్ని గుర్తించిన ఎలుగుబంటి, వారి వెంట వెళ్లటానికి సిద్ధపడింది. ఈ వాలక మంతా కనిపెట్టిన గుణసుందరి, "మీరు నా మొరాలింపవచ్చిన పుణ్యాత్ములో; దేవతలో అయివుంటారు. నన్ను కటాక్షించండి!" అంటూ ఆ కిరాతదంపతుల కాళ్ల మీద పడ్డది. "నీకు శుభం చేస్తాములే నిశ్చింతగా ఉండు!" అని గుణసుందరిని ఆశీర్వదించి, ఆ కిరాతదంపతులు ఎలుగు బంటిని తీసుకొని బయల్దేరారు.

పార్వతీపరమేశ్వరులు ఆ ఎలుగు బంటిని ఆడించుకొంటూ కోటలో ప్రవేశించారు. ఎలుగుబంటిచేత ఎన్నెన్నో వింత ప్రదర్శనాలు చేయించారు. దివ్యజ్ఞానం గల ఆ ఎలుగుబంటి అభినయించి జోస్యం



చెప్పనారంభించింది. మహేంద్రమణి పలికే ఉపాయంకూడా అది చెప్పగలదని వదంతి వ్యాపించింది.

ఈసంగతి చెవిని బడగానే మంత్రి, సేనాపతులు వెంటనే వచ్చి ఎలుగుబంటినీ కిరాతదంపతులనూ రాజుగారివద్దకు తీసుకువెళ్లారు.

మణిని పట్టుకవచ్చి ఎదుట పెట్టేవరకు, ఎలుగుబంటి అభినయించింది. 'అది ఏమిటి?' అని అడిగితే, "ఈ రాజును ఏ కూతురు నిజంగా ప్రేమిస్తున్నదో, ఆమె తన మగనితోసహా ముమ్మారు ప్రదక్షిణం చేసినట్టయితే మహేంద్రమణి పలుకుతుంది" అని కిరాత దంపతులు ఎలుగుబంటి అభినయానికి అర్థం చెప్పారు.

"ఒకరేమిటి, ఇద్దరం ఉన్నాము" అంటూ, రూపా హేమలు తమతమ భర్తలను వెంటబెట్టుకుని, మడికట్టుకువచ్చి మణిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేశారు. వారు ఎంతసేపు తిరిగినా మణిపలకలేదు.

"ఏమో అనుకున్నాము. నిజంగానే, ఏ రాయో చేత పట్టుకవచ్చి, మా పరువు కూడా తీసివేశారు వీళ్లు" అని రూపా హేమలు తమ భర్తలను ఆడిపోసి, వాళ్ళపైన మెటికలు విరిచారు. మహారాజు మళ్లీ నిస్పృహలో పడ్డాడు.

ఎలుగుబంటి మళ్లీ అభినయించింది: 'అదేమిటి?' అని అడిగితే, భోరుభోరుమంటూ, "ఊరిచివరను నీ చిన్నకూతురు ఉన్నది. ఆమెవచ్చి ప్రదక్షిణం చేస్తే మణి తప్పక పలుకుతుంది" అంటూ కిరాత దంపతులు అర్థం చెప్పారు. వెంటనే మంత్రీ, సేనాదేవీ వెళ్లి గూడెంలోవున్న గుణసుందరిని వెంటబెట్టుకు వచ్చారు.

కోటలోకి వచ్చీ రావడంతోనే, గుణసుందరి తండ్రిమీద పడి, గోడుగోడున ఏడ్చింది. "చిట్టితల్లీ!—నీకు నేనెంత

అన్యాయం చేసినప్పటికీ, నీకు నామీది అభిమానం కొంచెమైనా తగ్గలేదు. ఇదే నాకు పదివే" లంటూ మహారాజు గుణసుందరిని చేరదీసుకొని, అక్కున అదుముకొన్నాడు.

అక్కడ సమావేశమైన ప్రజలందరూ ఏమవుతుందో చూడామనే ఆత్రంతో, గుణసుందరిని ముందు మణిచుట్టూ ప్రదక్షిణం చేయమని వేగిరపెట్టారు. ఆమె అందుకు సిద్ధపడేసరికి, "చిట్టితల్లీ!—నువ్వ నీ పతితో కలసి ప్రదక్షిణం చేయాలి" అన్నది పార్వతీదేవి.




"నా భర్త దురదృష్టవశాత్తు ఎలుగుబంటిగా మారిపోయారు. మీ రెవరో పుణ్యాత్ముల్లాగా కనబడుతున్నారు. దయఉంచి నా భర్త శాపవిమోచన మార్గం సెలవియ్యండి" అంటూ గుణసుందరి దేవిని ప్రార్థించింది.

"అయ్యో! ఏమిటీ, దైవాధీనం పాపం, ఎలుగుబంటి ఐపోయాడా?" అని అందరూ ఆశ్చర్యపడ్డారు. అప్పుడు పార్వతి "అసలు ఈ మణిని సాధించుకువచ్చింది ఎవరో నిజం చెప్పినట్లైతే, నీ భర్తకు యథారూపం వచ్చేస్తుంది. ఇదుగో చూడు" అంటూ, ఎలుగుబంటికి చెంగోలు అందించింది.

ఆ చెంగోలు తీసుకొని ఎలుగుబంటి, హరమతినీ కాలమతినీ బాది విడిచిపెట్టింది. చెంగోలు దెబ్బలు పడలేక వాళ్లు "బాబోయి క్షమించండి. మణిని సాధించింది దైవాధీనమే" అని నిజంచెప్పివేసి, "క్షమించు", మంటూ ఎలుగుబంటి కాళ్లమీద పడ్డారు.

ఆ చెంగోలు తీసుకుని, పార్వతి రూపాహేమలనుకూడా అదిలించింది.

వాళ్లు నేరం ఒప్పుకొని, "చెల్లాయీ! క్షమించవా?" అంటూ గుణసుందరి కాళ్లమీద పడ్డారు.

అప్పుడు, కిరాత దంపతుల అనతితో ఎలుగుబంటి ఎప్పటి దైవాధీనంగా మారి

పోయాడు. మహారాజు కిరాతదంపతులు ఫలానా అని గ్రహించి, వారికి నమస్కరించాడు. గుణసుందరీ, దైవాధీనం కలసి, ప్రదక్షిణం చేసిన వెంటనే మహేంద్రమణి ధగధగ మెరసింది.

"రాజా, నిన్ను నిజంగా ప్రేమించేవారు ఎవరో, మోసకత్తెలెవరో ఇప్పుడైనా తెలుసుకొన్నావా?" అని పార్వతీదేవి రాజును హెచ్చరించింది. గుణసుందరి మణిచేత తండ్రిని స్పృశించిన తక్షణమే, మహారాజు వ్యాధి ఎక్కడిదక్కడనే మాయమై పూర్తి స్వస్తత చేకూరింది.

అప్పుడాయన గుణసుందరిని దగ్గరకు తీసుకొని, "తల్లీ! నీ మహిమ తెలుసుకోలేక పోయాను. నీవూ, నీ భర్తే నన్ను ప్రేమించారు. కనుక, నా రాజ్యానికి మిమ్మల్నే పట్టాభిషిక్తుల జేస్తాను" అని చెబుతూ వెంటనే దైవాధీనానికి పట్టం కట్టాడు.

అంతా సంతోషించారు. కాని మహారాజు గుణసుందరిని చూచి, "ఈ వృద్ధుణ్ణి నీ మెడకు కట్టి నేను నీకుచేసిన అన్యాయం మాత్రం ఇంకా మిగిలిపోయిందే" అని విచారించాడు. అప్పుడు, పార్వతీదేవి "ఓ రాజా ఇంకా నీకు అహంకారం చావలేదు. చిట్టి తల్లికి పరమేశ్వరు డనుగ్రహించిన అభర్త ఎవరో చూడు" అంటూ, దైవాధీనాన్ని ఇక నిజరూపంలో బయల్పడమని శాసించింది. అప్పుడు దైవాధీనం భువన మోహన సౌందర్యంతో వీరసేనకుమారుడై వెలయగా అందరూ ఆశ్చర్యచకితులై ఆనందించారు. పరమానందభరితుడై, మహారాజు, నిజంగా మీరు 'దేవత' లంటూ ఎరుకదంపతులకు ప్రణమిల్లాడు.

అంతా సంతోషంతో స్తోత్రం చేయగా అందరినీదీవిస్తూ, శ్రీ పార్వతీపరమేశ్వరులు అంతర్థానమైనారు. [అయిపోయింది]





# నల్ల బంగారం

ఒక వూరిలో వక్రుడు, ఉక్రుడు అని ఇద్దరు అన్నాదమ్ములు ఉండేవారు. వారు నివసించే వూరికి, మూడు వందల మైళ్ళ దూరంలో ఒక కొండ ఉన్నదనీ, ఆ కొండలో బంగారం ఉన్నదనీ తెలిసింది. బంగారం అంటే ఎవరికైనా ఆశే కదా!

"భేష్, బాగా వున్నది తమ్ముడూ! మన వెంట కొంతమంది కూలీలను తీసుకువెళ్లి, అక్కడ వున్న ఆ బంగారమంతా తెచ్చు కుందాము. ఎలా అయినా శ్రమపడి ఒక్క మణుగు బంగారం తెచ్చుకున్నామంటే, మనం ఇద్దరమూ ఆజన్మాంతమూ హాయిగా కాలిమీద కాలు వేసుకొని కాల క్షేపం చేయవచ్చు," అని వక్రుడు చిన్న వాడికి ఆశపెట్టాడు.

కష్టం లేకుండా, తేరగా దొరికితే అనుభ విద్దామని చూస్తూంటాడు వక్రుడు ఎప్పుడూ. అందుకనే, సునాయాసంగా బంగారం దొరుకుతుందని వినేసరికల్లా అతను ఆశ పడ్డాడు. కాని తమ్ముని ఉద్దేశం వేరు. ఈ కారణంచేతనే, కొండమీది బంగారమును గురించి తన అన్న అంతగా ఆత్రపడి చెప్పినా, ఉక్రుడు ఎక్కువ ఉత్సాహం చూపలేదు. అయినప్పటికీ, పెద్దవానిమాట జవదాటడం ఇష్టంలేక వక్రునితో ఉక్రుడు "సరే అన్నయ్యా, అలాగే వెళ్లి తెచ్చు కుందాములే" అని తన సమ్మతి తెలిపాడు.

వక్రుడు కొంతసొమ్ము చేతపుచ్చుకొని, కూలీజట్టుని వెంటబెట్టుకొని, మజిలీలు చేసుకొంటూ, ఇంచుమించు ఒక నెల రోజులకు ఆ పర్వతం చేరుకొన్నాడు.

ఆత్రంతో వున్న అన్నగారు, కూలీలతో సహా గబ గబ కొండ ఎక్కి, వెంటనే తవ్వ పని ప్రారంభించాడు. తమ్ముడు మాత్రం అతనితో వెళ్ళక, "అన్నయ్యా!— అంద రమూ కొండపైన కూర్చుని చేసేదేమున్నది?

జె. కృష్ణన్, కోడంబాకం



నీవు పని పూర్తిచేసుకొని వచ్చేవరకు నేను ఇక్కడనే వుండి కాపలా కాస్తాను" అనే వరకు, వక్రుడు సరేనన్నాడు.

ఉక్రుడు, కొండదిగువనున్న ఆ గ్రామస్థులను మంచి చేసికొని, చిన్న నివాసం ఏర్పరచుకొన్నాడు. కొద్ది రోజులకల్లా తను వారిమధ్యను తలలో నాలుకగా మసులుకొంటూ వుండటంచేత, వారు ఉక్రుని కోరికలన్నీ కాదనకుండా తీరుస్తూ వచ్చారు.

కొంతకాలమైన తరువాత ఉక్రుడు ఆవూరి మునసబు వద్దకు వెళ్ళి "అయ్యా! నేను ఇలా వ్యర్థంగా కాలం గడపడం బాగులేదు. కనుక, మీద్వారా నాకు ఏదైనా పొలం కౌలుకు ఏర్పాటు చేయించండి. పంట పండగానే ఋణాలు తీర్మానం చేసుకొంటాను" అని కోరేవరకు, గ్రామ మునసబు సంతోషంతో అతనికి మూడు ఎకరముల నేలా, అది సాగుచేయటానికి అవసరమైన పరికరములూ, ధనమూ, పరివారమూ అన్నీ సమకూర్చి పెట్టాడు.

ఈ విధంగా తనకు లభించిన సాయముతో ఉక్రుడు కష్టపడి పొలం సాగుచేసి పండించాడు. అతనికి దైవసాయము తోడుపడటంచేత, పంట బాగా పండింది. వ్యవసాయఖర్చులు, మునసబు పెట్టిన మదుపు పోను నికరంగా పాతిక బస్తాల ధాన్యం ఉక్రునివంతుకు మిగిలింది.

ఉక్రుడు ఇలా కష్టపడి బాగుపడినందుకు ఆ గ్రామస్థు లందరూ సంతోషించారు. అతను, తనవంతు ధాన్యమును మునసబు ఇచ్చిన ఒక చిన్న గుడిసెలో దాచుకొని, కులాసాగా కాలం గడుపుతున్నాడు. ఆతను పంటపండించి, ధాన్యం నిలవ వేసుకొనేవరకు సుమారు ఆరు మాసముల కాలం పట్టింది.

కూలీలతోసహా మరికొద్దిరోజులకే అతని అన్న వక్రుడు కొండదిగి వచ్చాడు. వారి